# సూక్తం - 31

# క్రిమిరోగ నివారణ సూక్తం

ఋషి: కాణ్వుడు : దేవత : 1 మహీ : 2-5 క్రిమిజమ్భనమ్ ॥ ఛందస్సు : 1 అనుష్టుప్ : 2,4 ఉపరిష్టాద్ విరాడ్ బృహతీ, 3,5 ఆర్షీ త్రిష్టుప్ ॥

మంత్రములు : ॥ 5 ॥

వినియోగం: శరీరగత వివిధ క్రిమిరోగముల శాంతికై చేసే హోమంలో దీనికి వినియోగం.

మంత్రము.

ఇన్ద్రస్య యా మహీ దృషత్ క్రిమేర్విశ్వస్య తర్హణీ ।
తయా పినష్మి సం క్రిమీన్ దృషదా ఖల్వాం ఇవ ॥ 1 ॥

పదము

ఇన్ద్రస్య । యా । మహీ । దృషత్ । క్రిమేః । విశ్వస్య । తర్హణీ ।
తయా । పినష్మి । సమ్ । క్రిమీన్ । దృషదా । ఖల్వాన్ఽఇవ ॥1॥

అనువాదం:

ఇంద్ర సంబంధమైన పెద్దశిల
సర్వక్రిమి సంహారకమైనది.
విసురు రాయితో సెనగలను వలె దానితో
శరీరాంతర్గతాలైన సర్వక్రిములను సంచూర్ణం చేస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము.

దృష్టమదృష్ట మతృహమథో కురూరుమతృహమ్ ।
అల్గణ్డాన్త్సర్వాన్ఛలునాన్ క్రిమీన్ వచసా జమ్భయామసి ॥ 2 ॥

పదము.

దృష్టమ్ । అదృష్టమ్ । అతృహమ్ । అథో ఇతి । కురూరుమ్ ।
అతృహమ్ ।

అల్గణ్డూన్ । సర్వాన్ । శలునాన్ । క్రిమీన్ । వచసా । జమ్భయా
మసి ॥ 2 ॥

**అనువాదం :**

కంటికి కనిపించే క్రిమి జాతాన్ని,
కనిపించని క్రిమి జాతాన్ని నశింప జేస్తున్నాను.
అంతేకాక శరీరం లోపలవలె
అల్లుకొని ఉన్న అంతర్గత క్రిమి కులాన్ని కూడా
నాశనం చేస్తున్నాను.
అల్గండువు లను, శల్గము లను, క్రిములను,
ఇతర సర్వ క్రిములను మంత్రంతో నాశనం చేస్తున్నాను. ॥ 2 ॥

**మంత్రము :**

అల్గణ్డూన్ । హన్మి మహతా వధేన
దూనా అదూనా అరసా అభూవన్ ।
శిష్టా నశిష్టాన్ ని తిరామి వాచా
యథా క్రిమీణాం న కిరుచ్ఛిషాతై ॥ 3 ॥

**పదము :**

అల్గణ్డూన్ । హన్మి । మహతా । వధేన ।
దూనాః । అదూనాః । అరసాః । అభూవన్ ।
శిష్టాన్ । అశిష్టాన్ । ని । తిరామి । వాచా ।
యథా । క్రిమీణామ్ । నకిః । ఉత్ఽశిషాతై ॥ 3 ॥

అనువాదం :

* అల్గండువులను ఉత్కృష్ట మంత్రౌషధాది
సాధనంతో సంహరిస్తున్నాను.
నా ఔషధాదులతో పరితప్తములైనవి,
పరితప్తం కానివి, శుష్కములైనవి ఏవైతే ఉన్నవో,
శిష్టములైనవి, అశిష్టములైనవి
ఏవైతే ఉన్నవో-వాటి నన్నిటిని
మంత్రంతో నిహతం చేస్తున్నాను.
వా టన్నిటిలో ఏ ఒక్కటీ మిగులకుండుగాక ! ॥ 3 ॥

మంత్రము :

అన్వా᳚న్త్ర్యం᳚ శీర్ష॒ణ్య᳚1మథో॒ పార్ష్టే᳚యం॒ క్రిమీ᳚న్ ।
అ॒వ॒స్క॒వం వ్య᳚ధ్వ॒రం క్రిమీ॒న్ వచ॑సా జ॒మ్భ॒యా॒మ॒సి ॥ 4 ॥

పదము :

అను᳚ఽఆ॒న్త్ర్యమ్। శీ॒ర్ష॒ణ్యఽమ్ । అథో॒ ఇతి᳚ । పార్ష్టే᳚యమ్ । క్రిమీ᳚న్।
అ॒వ॒స్క॒వమ్ । వి॒ఽఅ॒ధ్వ॒రమ్ । క్రిమీ᳚న్ । వచ॑సా । జ॒మ్భ॒యా॒మ॒సి ॥ 4 ॥

అనువాదం :

ప్రేవులలోని క్రిములను, శిరోభవములైన క్రిములను,
పార్శ్వ భవములైన క్రిములను నశింప జేస్తున్నాను.
లోనికి వెళ్ళే వాని వివిధ మార్గాలను నశింప జేస్తున్నాను.
వీ టినన్నిటిని మంత్రంతో నశింప జేస్తున్నాను ॥ 4 ॥

---

* రక్తమాంస దూషకములైన క్రిములను

మంత్రము.

యే క్రిమయః పర్వతేషు వనే

ష్వోషధీషు పశుష్వప్స్వ1 న్తః ।

యే అస్మాకం తన్వ౨మావివిశుః

సర్వం తద్ధన్మి జనిమ క్రిమీణామ్ ॥ 5 ॥

పదము ।

యే । క్రిమయః । పర్వతేషు । వనేషు ।

ఓషధీషు । పశుషు । అప్౨సు । అన్తః ।

యే । అస్మాకమ్ । తన్వ౨మ్ । ఆ౨వివిశుః ।

సర్వమ్ । తత్ । హన్మి । జనిమ । క్రిమీణామ్ ॥ 5 ॥

ఇతి పంచమోఽనువాకః

అనువాదం :

పర్వతాదుల మధ్యంలో ఉన్న క్రిములు
వ్రణ ముఖంగా మా శరీరాల్లో ప్రవేశించినవి.
వానిని నిశ్శేషంగా, ఆ సర్వక్రిమి జాతినే
నాశనం చేస్తున్నాను. ॥ 5 ॥

ఇది ముప్పైయొకటవ సూక్తం

ఇది ఐదవ అనువాకం.